శ్రీరస్తు.

# బా ట సా రి.

నిర్వచనాంధ్రప్రబంధము

బ్రహ్మశ్రీ - శ్రీమదజ్జాడాదిభట్ల

నారాయణదాసుగారిచే

వి ర చి త ము.

నాలుగవ కూర్పు

ప్రకాశకులు :
శ్రీ ఆదిభట్ల నారాయణదాస అముద్రిత గ్రంథప్రచురణ సంఘము
వి జ య న గ ర ము.
1960

 [ వెల రు 2—00



ఆటపాటల మేటి

శ్రీ మదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసుగారు

# PREFACE.

THE story embodied in this book is an allegory of human life which begins in sheer ignorance and ends in perfect knowledge. In writing this small poetical work my main object had been to present to the Telugu reading public an attempt at something original as to plot, coupled with vividness of natural descriptions told in easy Telugu devoid of all the artificialities of the usual ornate style. This system, I venture to hope, would be acceptable to cultured readers whose tastes have been mellowed by the ever-advancing modern Literature of the West.

I beg to dedicate this humble book to the Hon'ble Rai Bahadur P. ANANDA CHARLU, Vidya Vinoda, B.L., C.I.E., F.M.U., one of the best friends of Telugu Literature, as a small token of my ever-lasting gratitude to him.

VIZIANAGRAM,
*1st June 1933*

A. NARAYANADAS,
*Principal,*
*Maharajh's Music College.*

ఓంనమో భగవతే రమణాయ.

# పీఠిక

శ్రీ మదజ్జాడ ఆదిభట్ట నారాయణదాసుగారు మహాకవి. గాయక, వైణిక, నట సార్వభౌముఁడు. జగమెఱిఁగిన బ్రాహ్మణుడు. శ్రీ దాసుగారి యభిమతమున బాటసారి గూఢార్థము గల ఖండకృతి. దీనిని జదువు పాఠకులు లౌకికాధ్యాత్మిక దృష్టిద్వయమును గలిగి యుండవలయును. ఇందలి గూఢార్థమును శ్రీ దాసుగారే కొంతవఱకును కృతికిముందు వివరించిరి. కనుక దాని ననుసరించి ప్రతిపద్యమునందును, వాచ్యార్థముకంటె వేరైన గూఢార్థము నూహించికొనవలసియున్నది. ఈ యూహ పాఠకులందఱికిని నేకరూపమునఁ గలుగునని చెప్పుటకువీలుపడదు. ఎవరెట్లూహించినను ఆయూహ యాధ్యాత్మిక మార్గమునకు విరుద్ధముగాకుండ నుండవలయును.

అర్థద్వయమును శ్లేషములేని కావ్యమునందుఁ దెలుపుట సులభసాధ్యముకాదు. మహాకవి యిందు గూఢార్థమును వివక్షించితినని చెప్పుటవలన నిందు ద్వితీయార్థప్రతీతి నూహింపవలసియున్నది. ఈ గ్రంథము నీమహాకవి, మిక్కిలి చిన్నవయస్సునందే రచించెను. దీనియందు నాటు తెలుఁగు మాటలెక్కువగఁగూర్పఁబడినవి. తత్సమపదములు, తద్భవపదములు, నరుదుగాఁ గూర్చబడియున్నవి. నాటు తెలుఁగునందలి తీపి, ఈ కవిచంద్రునకు నానాటికి వృద్ధినొంది, తత్సమ తద్భవ రూపమగు తెలుఁగుభాషయందు మిగుల నరుచిని సంఘటించినది. ఈ గ్రంథమునందే యీయరుచి కంకురార్పణము జరిగినట్లున్నది. నాటు తెలుఁగు మాటలు మూడుపాళ్ళు కూర్పబడి

నవి, కథ చిన్నది. కల్పన దొడ్డది. ఇందు వర్ణింపఁబడిన కథా సంగ్రహము నిట్లుండఁగునది.

ఒకానొక బాటసారి (జీవుఁడు) దారపుత్త్రిలతో(విద్యా వివేకములతో) నోడపై సముద్రయానమొనర్చుచుండెను. గాలి తాకిడిచేత నాయోడ యొక కొండనుదాకి పగిలెను. అతఁడును వాని దారపుత్త్రిలును, విడివడిరి. బాటసారి యెట్లో యొడ్డు నకుఁ జేరెను. దారపుత్త్రులజాడతెలియదయ్యెను. విరహియగు బాటసారి తెల్లవారగనే యొకకొండనుజూచి దానినుండి ప్రవహించు నొక సెలయేటిని జూచుచు నొకతోట చెంతకరగి, యచట నిదురవోయెను. తరువాత మేల్కాంచెను. మేల్కొనిన బాటసారి, పండువెన్నెలలో పయనించుచు నొకసూదికొండను జూచి,చాపరాతిమీదవెన్నానించి పరుండి తనసుందరిని భావించికొనుచు నచటి చెరువున స్నానమాడి, నీరుద్రావి, పూవుదోట నుండివింతలఁజూచుచు, పోవుచుఁ, గొంతదూరమునకరిగిరాత్రి, సమయమున నొకదివ్యభవనమునకువచ్చి, దానిలోనికిఁజొచ్చి, దాని సౌందర్యమున కచ్చెరువందుచుండెను.

కాంతాబృందముతో ఁగూడిన ఒక పాదుసాహి(రాజు) దిస్స మొులతోనున్న బాటసారికొక దువ్వలువ నొసఁగి, నీవెవ్వఁడవని ప్రశ్నించెను. బాటసారి యా షేనికి తనకతఁ దెలిపి, ఆ షేని కోటకుఁజని కొంతకాలముండెను. ఆషేడు విరాళితోనున్న బాటసారి నోడరేవుదాపునకుఁ గొనిపోయి యచట నున్న గంటకంబమునందలి వ్రాతను జూపెను. దానివలన నింకొకనావ తనవారిని రక్షించినట్లు తెలిసికొని బాటసారి సంతసించెను. తదుపరి కొన్నాళ్ళకాషేడు తనయన్న కొమరు

నతనికప్పగించుచు, వారి నోడనెక్కించి వేరొకపట్టణమున కంపెను.

తదుపరి నాపట్టణమునందే యతఁడు తనకాంతను, చిన్న కొమరుని, గాంచెను. ఆతేని యన్నకొడుకునకుఁగూడ నతఁడు వలచిన సుందరి లభించెను. తరువాత భాటసారి తన దార పుత్త్రిలను, నూత్నదంపతులను, దోడ్కొని, వెనుకటి పట్టణమునకువచ్చి, తేనికి వారినప్పగించి యానృపాలుని పోషణమున దారపుత్త్రిలతోఁ గూడి సుఖముగా నుండెను.

ఈకథయందంతటను వేదాంతార్థమును సమన్వయించుకొనవలెను. ఇందలి శైలిసుగమమైయున్నది. గుణము మాధుర్యము. క్రింది పద్యమంత్యప్రాసముతోఁ గూర్చఁబడి యెంత మధురముగానున్నదో చూడుఁడు.

గీ॥ తెలి మొగలిపువ్వు రేఁకరేకుల తళతళ
గలుగు చెక్కిళ్లనుండి వాల్కనుల నీరు
వలుద ముత్తియములవలెఁ బడుట-నీదు
చెలువ వలవంత కొకవింత చెలువుఁదెచ్చె॥

(ప 98, పేజీ 23)

గీ॥ మొదట వావులెంచింగిన ముద్దుచూపుఁ
బిదపఁ గురులుంచు దాపున బెదరుచూపుఁ
దగిలి యెడఁ బాయఁజాలని దిగులుచూపుఁ
గనుల దూఖూచిచూపు నాకన్నెచూపు॥

(ప ౧౩౪, పేజీ 30)

చక్కని వర్ణనలున్నవి. రసము సంయోగాంతమగు, విప్రలంభ శృంగారము. బాటసారియందలి కవిత్వపుబాట - విద్యార్థులకు విహారయోగ్యముగానున్నది.

విద్యాధికారులు దీని యౌచిత్యము నెఱిఁగి, యాయా విద్యాపరీక్షలకు, పాఠ్యము నొనర్చుట యావశ్యకమని తలఁతును,

ఇట్లు,
బుధజన విధేయుడు,
పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి.
ఆంధ్ర ప్రధానాధ్యాపకుఁడు,
ప్రభుత్వ మహారాజ సంస్కృత కళాశాల,
విజయనగరము.

పత్తిపాటివారివీధి
విజయనగరము.
తే 26-3-60 ది

# ప్రశంసా పద్యావళి.

రాజమహేంద్రివర పాలక హూణ విద్యా పాఠశాలాంధ్ర ప్రథమోపాధ్యాయులగు మహామహోపాధ్యాయ శ్రీకొక్కొండ వెంకటరత్నశర్మగారు—

రత్నావళి॥ నారాయణ దాసుఁ డభిజ్ఞుఁడుగా
నను, ధ్వన్యర్థము స్ఫురియింపం
గా రచియించెను "బాటసారి" యను
కబ్బంబదిదె స్వభావోక్తిన్
క్షీరాన్నమువలె నుండెడుఁ గావున
జిన్న పెద్దలకు నందఱకున్

గోరందగు నైనన్ విద్యార్థుల
కుం బాఠ్యమ్మయి భాసిల్లన్॥

విజయనగర ఆంగ్లేయ పాఠశాలాంధ్రభాషా ప్రధానోపా ధ్యాయులగు బ్రహ్మశ్రీ పంతుల శ్రీరామశాస్త్రిగారు

శా॥ ఆచారాదులతోడ నొక్క కథయూ। హంజేసికల్పించుటన్
మీచాతుర్యముమెచ్చనయ్యె మరియున్। మీబాటసారిన్ రస
ప్రాచుర్యంబు స్ఫురించె మీకవిత ధా। రాళంబు నారాయణా
ర్యా! చిత్తంబున జాతిరీతులకు హ।ర్షంబొందితిన్ మీకృతిన్॥

విజయనగర హూణవిద్యా పాఠశాలాంధ్రభాషా ద్వితీయో పాధ్యాయులగు బ్రహ్మశ్రీ భాగవత రామమూర్తిశాస్త్రిగారు

శ్లో॥ ఆదిభట్టాన్వయాంభోధి, రాకాచంద్రేణ ధీమతా
శ్రీ నారాయణదాసేన, హరేశ్చారిత్రవేదినా॥ ౧

బాటసారీతి విఖ్యాతః, ప్రబంధః కల్పితోముదా
తత్రత్యపదవిన్యాసో, రసాలంకార భాసురః॥ ౨

ఆంధ్రవాక్ప్రచురోనూత్న, కల్పనామోదకృత్సదా
విదుషాంజన యత్యాశు, ముదంచిత్తేషుకామపి॥ ౩

తే॥ గీ॥ ధ్వని మనోహారి సరస సత్పద విహారి
అత్యలంకారి నవ్యకథాధికారి
స్థిరగుణాచారి సాధువృత్తి ప్రచారి
భళి! స్వకర్తృనుసారి యీ బాటసారి॥.

# బాటసారికి గూఢార్థము.

బాటసారి మాయాగర్భ నరక విముక్తుఁడగుచుఁ బూర్వజన్మవాసన న్జింతింపఁదొడఁగిన యాత్ముఁడు. దారసుతులు విద్యావివేకములు. మహోదధిసంసారము. ఓడపుణ్యము. ఓడన్బగిల్చినకొండ పాపము, సూదికొండ ప్రకృతి, సరోనదీపక్కణసీమలు జాగ్రత్స్వప్నసుషుప్తులు. ఏడంతరవు లేడు రంగులిరువదెనిమిది గదులుగల యొంటికంబము మేడ. సప్తధాతువులు సప్తోపాయములు. అరిషడ్వర్గములు, పంచకోశములు. నాల్గు పురుషార్థములు, త్రిగుణవికారములు. ప్రవృత్తినివృత్తులు, అష్టాంగయోగములు. కంబముపాధి. రాజదంపతులు జ్ఞానవైరాగ్యములు. చెలికత్తెలష్టాంగములు. తొలిరాజధానియైహికము. రెండవరాజధాని యాముష్మికము. ప్రాఁతకర్మము. నూత్నవధూవరులు భక్తిశ్రద్ధలు. బాటసారికి స్వదారసుతపునస్సమావేశము కైవల్యప్రాప్తి. గుఱ్ఱము బుద్ధి, బాకుతుపాకి, బల్లెమీఁటెలు సాధనచతుష్టయసంపత్తులు. పులి, పందులు రాగద్వేషములు. జాగిలములు వ్రతములు. ఆసవము దీక్ష. దాది సంప్రదాయము గడియారమాయువు. ఉంగరము లక్ష్యము. వాన—దేవతాప్రసాదము. మామగురుఁడు, బావ సఖుఁడు. విభ్రాంతుఁడై బద్ధుడగుచుఁ బ్రబుద్ధుఁడై ముక్తుఁడగుచుంట యాత్మని సహజక్రీడలని బాటసారి కథకంతకును వేదాంతపరముగా నర్థమిట్లూహ్యము. ఈబాటసారి కథ స్వకల్పితమేగాని యింకొక భాషాకావ్యమున కనువాద మెంతమాత్రమున్నాదిందుఁ దత్సమతద్భవము లచ్చతెలుఁగు వివరింపనలవి కాని పదార్థ ప్రకటనమునకు మాత్రమే యుంచుమించు

గాఁగూర్చఁబడినవి. మొత్తముపైఁ దత్సమతద్భవము లడ్డదిడ్డ ముగాఁ దఱుచు పద్యకావ్యములన్జొనిపి తీయని తేటతెలుఁగు నాటుపల్కుల న్జుల్కపర్చు వారుభయభాషల పర్యాప్తియు వణసౌజ్కర్యపరులు కవులింక మీఁదఁగాఁదగదు. ఈబాటసారి న్జేసియాడుచుఁబాడుచు న్దెలుఁగు వారలకు నే వినిపింప మొదలి డినపుడు నాయీడిరువదినాలుగేండ్లు.

# PREFACE.

Batasari was composed by Sri Adibhatla Narayana Dasu garu when he was barely twenty-four years old. It is a story woven by him, having an allegorical meaning. In this independent work we find not only the influence of Potana and other poets in Telugu, but also of English poets like Wordsworth and Tennyson. The nature descriptions are very vivid and inspiring. In Tennyson's works we find a harmonious blend of poetic ideas with scientific truths Narayanadas in verse No 21 describe the sun as a magician who by his light envelopes self effulgent stars, but makes little things on earth visible. A scientific phenomenon is very well described in the verse. Having passed Matriculation Examination Narayanadas knew something of Science also. In another verse he describes very aptly the immense pleasure which Archimedes felt when he discovered the great principle which goes after his name.

As copies of all the previous editions of the book published by Author are exhausted the Commitee has brought out this Edition. The committee is grateful to the renowned Artist Sri A. Paidiraju for his suggestive drawing of Batasari.

**V. Brahmaji Rao,**
*Secretary,*
Adibhatla Narayanadas
unprinted Works publication
committee.

Vizianagram,
D/ 21-4-1960



ఉ॥ ఒక్క మహానుభావుఁడు మ • హోదధియానముచేసి ముప్పున।
న్దక్కి తొలంగిపోవు నిజ•దార సుతార్థమున్నై సరోనదీ।
పక్కణ సీమలన్వెదకి•వారలు సుస్థితి నుంట గాంచి పెం।
పెక్కెను బాటసారియయి • యిక్కథపేర యశోవిహారి యై॥ ౧.

ఉ॥ ఎచ్చటనుండి నేనిచటి • కెట్టులవచ్చితిఁ గన్ను లెంతయు।
న్విచ్చినఁగానరాదిదియు•నిక్కమ యేమిదిపెద్దప్రోఁతనా।
కచ్చెరుపై వినంబడుఁ గ•టా తెలిసె న్మది దిట్టపడున్ఁబై।
వచ్చిన నీటితాఁకువడిఁ • బ్రాకుచునెట్టన నొడ్డుచేరితిన్॥ ౨.



ఆ॥ చిన్నికొడుకుతోడఁ । జెలియ యేమయ్యెనో
కొండతగిలి యోడ । కొట్టఁబడిన
తెన్నుతోఁచకుండెఁ । దెఱపినీదిటుముబ్బు
గ్రమ్మరేయిమిగులు । గానరాదు॥ ౩

ఆ॥ ఇట్లు బాటసారి । యెంతయు దిగులంది
కడువివేకశాలి । గానఁగొంత
త్రెప్పిఱిల్లి ప్రేమ । త్రెంపలేక విరాళి
చెందిముద్దరాలి । పొందుతలఁచి॥ ౪

ఉ॥ పాపపుదైవ మెంతపొర । పాటొనరించెను నన్మ్రిగిల్చె న
య్యో పికవాణి యోవికసి । తోత్పలలోచన నిన్నుబాసి యె
ట్లోపుదు జాముక్రింద మన । ముంటిమి ముచ్చటలాడు
కొంచు నా
హా పరిపూర్ణ చంద్రవద । నా మనకింకఋణంబు
చెల్లెనా॥ ౫

ఆ॥ అనుచు సొమ్మసిల్లి । యతఁడెట్టకేలకు
దిమ్మదీఱ డెంద । ముమ్మలింప
నలసినట్టి యంగ । ములఁ గూడఁ గొనిలేచి
నిలిచి నాల్గుదెసలు । కలయఁజూచి॥ ౬

క॥ కాని దైవము యిక్కడ
కా ననుదెచ్చితి విఁకెట్టు । లా నీమీదనే
బూని సయిరింతు నడిగోఁ
బైనెగడుఁ దూపుఁ దెల్ల । వారుచునుండెన్॥ ౭

చ॥ అనుచతఁడంతఁగాంచెఁ జటు । లానిలసంచల దూర్మి
మాలికా
ఘనవికటధ్వని ప్రబల । కబ్ధిసముత్ప్లవమాన రమ్యనూ

తన రవిబింబ మొక్కెడెసఁ । దక్కినదిక్కులఁ బిక్కటిల్లి యు
క్కునసడుమిన్నుదన్నునొక । కొండనుదండనుగాంచి వెండియున్॥ ౮

గీ॥ తొడరి యక్కొండనడుమ నె । క్కడనొ తొల్చు
కొనుచు వడిసైఁపలేక పాఱు । రునఁబఱంది
కీడ్గిలన్బడు బండల । నీడ్చుకొనుచు
నేపుమైఁద్రుళ్ళిపడు సెల । యేఱుగనియె॥ ౯

గీ॥ కాంచి యతఁడట్టె క్రొత్తలో । కంబునందు
నున్నతీరున నచ్చెరు । వొంది వేఱు
వంకఁ బోలేక యెద్దియు । న్బాలుపోక
తెంపుతోఁ దుదకాయేటి । తెన్నువట్టె॥ ౧౦

సీ॥ ఆయేటి కిరువంక । లం దేటవాలుగ
మెట్లమర్చినయట్లు । మీఱినెఱయఁ
బండినమామిళ్లు । పనసలు నిమ్మలు
నేరేళ్లు మఱివింత । తీరుచెట్లు
లెడనెడగెలలతో । నింపార వంగిన
కపురంపుటనఁటులు । కమ్మతావి
వెదచల్లు గొజ్జంగి । పొదరిండ్లు నందందఁ
జిన్నిపూఁదేనియ । ల్చిల్కుచోట్లు
కన్నులకు వింతపండువు । గాఁగ నతఁడు
చూచుచీశ్వరసృష్టికిఁ । జోద్యపడుచు
గొండసగమెక్కి నెమ్మది । గొనఁదలంచి
కూరుచుండెను సంపంగి । గున్నక్రింద॥ ౧౧

సీ॥ నెమరువేయుచు లేళ్లు । నీడల నాగెలోఁ
బొదలలో నెమళులు । కుదురుకొనియె
లోఁతుమడుంగుల । నీఁతాడె నేన్గులు
పందులు బురదలఁ । బాదుకొనియె
గొమ్మలపైఁ జేరుకొనియెఁ । గోఁతులు పుల్గు
లన్నియుఁదొఱ్ఱల । నణఁగఁజొచ్చె
లోవలఁబడి పులు । లావులింతలుదీసె
నొండులలోఁ బాము । లూపుౝలుచ్చె
నడవిసందడితగ్గె న । ల్కడలయందుఁ
జెలఁగి పొగచిమ్ముకొంచు కా । చిౝచ్చుహెచ్చె
రెండుజాముల వేసవి । మండిపడుచుఁ
గొండబీఁటలు వాఱఁగ । నెండకాఁచె॥ ౧౨

క॥ ఆయెండ తాఁకు వడియుౝ
హాయిగఁ జలినీరుచల్లు । నాయేటిదరిౝ
రేయివడుదాఁక నిద్దుర
వోయి యతఁడుమేలుకాంచెఁ । బొలుపుగ నంతన్॥ ౧౩

గీ॥ కడలినవ్వుచుఁ బొంగి సం । దడు లొనచెౝఁ
గప్పురపు దివ్వెవలెఁజందురి । డొప్పుమీఱ
గొండయంతయు మెండుగ । వెండివాఱఁ
బండువెన్నెల కన్నుల । పండువయ్యె॥ ౧౪

ఉ॥ అంత నతండు కన్నులకు । హాయిగవెన్నెల గాయఁ
గాంచి తా
నెంతయు సంతసించి పర । మేశునిపైఁ దనభారముంచి ని
శ్చింతఁజనంగనెంచి నలు । చెంగటులన్బరికించి దారిమొ

క్కింతయుఁదప్పిపోక సెల । యేఁటిదరిన్బడి యేగుచుండఁ
గన్॥ ౧౫

గీ॥ పులుఁగు మ్రూల్గులు బెబ్బులి । బొబ్బరింత
లడవినందంద నెమ్మది । కదలఁగొల్పఁ
దడబడుచతండు నడిరేయి । దాక నడిచి
దారికడ్డుగ నొకకొండ । తగులఁజూచి॥ ౧౬

చ॥ ఇదియొక సూదికొండ తెఱ । వీయక యీసెలయేరు
దీనిలో
పు దొలిచివచ్చుచున్నయది । పోవఁగ నాకిటమీఁద
దారియె
య్యదిచటఁ బ్రొద్దుదూఱువఱ । కాఁగెదనంచొక చాప
రాయి పె
న్గదియఁగమోపి మింటిదెస । గన్గొనుచున్దలపోసె నిట్టు
లన్॥ ౧౭

గీ॥ వెల్లఁబాఱిన జాబిల్లి । వేగుఁజుక్క
యును దివంబునవెలయుచు । నున్నయట్లు
చిన్నికొమరునితో ముద్దు । చెలియ తేలు
చుండెఁగాఁబోలు మున్నిట । నిండుదొఱఁగి॥ ౧౮

ఉ। ఎక్కడి నావయాత్రి లభి । యించె నహో మనపాల
దిక్కు లే
కక్కట నిన్నుబాసి చెలి । యా యిటులొంటిఁగ నుంట
వ్రాసెనే
మ్రుక్కడి దయ్యమింతపని । పుట్టునఁటంచు నెఱుంగ
నైతినే
చక్కని నిన్నువంటి సతి । జన్మశతంబులనేనిగల్గునే॥ ౧౯

క॥ అని యిట్లు సౌమ్యసిరి నె
ట్టినఁదెల్విన్బొందె యంత । టన్నేగుచు పూ
సినలాగు ప్రొద్దుపొడువఁగఁ
గనుఁగవనీరొత్తుకొంచుఁ గనుఁ । గొని పెలుచన్॥ ౨౦

గీ॥ పౌర గారడిసూర్యుండ । యుబ్బరంబు
కద బ్రతుకువలె నీకర । కౌశలంబు
అల్ప భౌమంబులన్జూపి । యధికదివ్య
ములను గన్పట్టనీయక । మోసపుచ్చు॥ ౨౧

క॥ అని యిట్లు బ్రతుకుపై రోఁ
తను బట్టి యసూయపుట్టఁ । దనకక్షుల ని
చ్చిన లోకబాంధవుండన
క నిష్ఠురములాడి యతఁడు । గమనోన్ముఖుఁడై॥ ౨౨

క॥ పరికించి కొండయావల
కరిగెడు నొకలోయదారి । నారసి యందున్
జొరఁబడుచు నెట్టకేలకుఁ
జెరువొక్కటి గాంచి దాని । చెలువున్బొగడెన్॥ ౨౩

సీ॥ చుట్టునఁగట్టులు । పెట్టినయట్టులు
బలు కొండల నెవండు । నిలిపినాఁడు
నీటిమట్టముదాఁక । నాటి నల్దట్టుల
వృక్షపంక్తులెవండు । పెంచినాఁడు
కనుచూపు దూరంబు । గాఁ జదరముగ నెం
తయు లోఁతుగ నెవండు । త్రవ్వినాఁడు
పలువన్నియల తామ । రలు కలువలు వర్సఁ
బూలనారెవ్వఁడు । పోసినాఁడు

సృష్టివైచిత్ర్య మహహా యూ । హింపఁ దరమ
యే మనుష్యుల చేఁత కీ । యింపువచ్చు
నేను చూచిన సెలయేఱు । దీనిలోనఁ
దొడరి కాఁబోలు నిక్కొండఁ । దొలిచిపడియె॥ ౨౪

క॥ ఇటులబ్బురపడి యతఁడా
తటాకమునఁ దానమాడి । తపనున్గని దూ
ఱుటకై మొక్కుచు నంజలి
పుటమ్ముతో నీరుపట్టి । పొగడన్జొచ్చెన్॥ ౨౫

గీ॥ అడలుగొలిపెడు చీఁకటి । కడలినుండి
కడపి మముఁగాచు తరణి నీ । కిదెదమ్రొక్కు
అహితములఁ గొట్టి గొప్పమే । ళ్లాచరించి
యేలుచుండెడు మిత్ర నీ । కిదె జోహారు॥ ౨౬

క॥ అనుచర్ఘ్యామొసఁగి యొద్దునఁ
దినఁదగు దుంపలొకకొన్ని । తీసి నమలి తీ
యని నీరుఁద్రాగి బలుకా
న్గునీడకున్గడఁగి యతఁడు । కూర్చున్నతఱిన్॥ ౨౭

చ॥ గిరు లదరంగ నొక్కమొగి । గీఁకరావత్పెలరేఁగె నంతట
న్ధరణి వడంకునట్టులఁ బ । దంబుల చప్పుడుతోఁ చెఁ
బిమ్మటన్
గరములఁబట్టి చెట్టులు పె । కల్చుచు పీనులపిచుకొంచు స
త్వరముగ గొండలీనిన వి । ధంబున నేన్గులు చెర్వుచేరఁ
గన్॥ ౨౮

గీ॥ తమ్ముమాలిన ధర్మంబు । తగదటంచుఁ
దలల నలరించు తమ మొద । ళులను గావఁ

బూని చాఁచిన నీడల। ముడుఁచుకొనియెఁ
బాదపంబులు నడిమింట। భానుఁడొప్పె॥ ౨౯

క॥ అబ్బురము వెఱపు పెనఁగొన
గొబ్బున నతఁడొక్కమఱ్ఱి। కొనకెక్కెను జె
ర్వుబ్బఁగ నేనుఁగు కదుపులు
గుబ్బున డిగి దప్పితీర్చుకొ। కొని చెలువారన్॥ ౩౦

ఉ॥ కొమ్ములఁజొన్పి యొడ్లుపడఁ। గ్రుమ్మను గొన్ని జలమ్ము పీల్చిపైఁ
జిమ్మను గొన్ని తామరలు। చెన్గలువల్పెకలించుఁ గొన్ని తొం
డమ్ముల నీటమీఁదను ద। టాలున మోదును గొన్ని పట్టుపం
తమ్ములనీఁదుఁ గొన్ని మెయి। తాఁకులఁజొక్కను గొన్నియేనుఁగుల్॥

గీ॥ దన్తియూథమ్ము లిట్టులఁ। దనివితీఱఁ
జెరువులోపలఁ జెరలాడి। పరువులిడుచు
మూరుకొను చెదురేగుచుఁ। బోరు చునికి
మూలలకుఁజేరెఁ బడమటఁ। బ్రొద్దుజారె॥ ౩౨

ఆ॥ అంతపఱకుఁ జెట్టు। నందుఁడి దవ్వుల
నాతఁ డొక్క యున్న। తాలయంబు
డెందమలరఁ గాంచి। క్రిందికిదిగి మేటి
పూవుఁదోఁటనుండి। పోవుచుండి॥ ౩౩

సీ॥ ఏవైపుజూచిన। నావైపుననె కమ్మ
తావులీనెడు వింత। పూవుఁబొదలు

నేవంకఁగనుఁగొన్న । నావంకనే ఫలి
యించు నానావిధ । వృక్షపఙ్క్తు
లేదిక్కు పరికింప । నాదిక్కునవె సన్త
తము నీరుచల్లు య । న్త్రములు మఱియు
నేతట్టుగాంచిన । నాతట్టునవె తీర్చి
కట్టిన మణిమయ । కుట్టిమమ్ము
లద్భుతానందములు పెన । యన్గ నతఁడు
గనుచుఁ గలయందు విహరించు । కరణిఁజనుచు
నొంటిపాటునకై వగ । పొంది యంత
లోనఁ దనచెలిఁదలఁచి యి । ట్లు పలవించె॥ ౩౪

సీ॥ పించియంబుల విప్పి । పెండ్లియాటల రొప్పి
యాడు నట్టువపిట్ట । జోడుఁజూచి
తనమిటారికిడంబు । తలిరుటాకువిడెంబు
వాడుకోయిలమిన్న । దాడిఁ జూచి
పడఁతితోడుత నచ్చు । పండు గుజురు ముచ్చు
టోడుచుఁ దినుచిల్క । ప్రోడఁజూచి
కమ్మతేనెల మెక్కి । కొమ్మకౌఁగిటఁజొక్కి
పాడు తేఁదుమ్మెద । కోడెఁజూచి
అంత గంతులహెచ్చి ర । వంత నొచ్చి
నేర్పరి యనుచు మెచ్చి ని । ట్టూర్పువుచ్చి
బయలు కౌఁగిళులకుఁ జొచ్చి । హాయలువిచ్చి
నచ్చి పొగలుచునుంటిఁ జా । న యిటువచ్చి॥ ౩౫

గీ॥ ఇన్నినోద్దెములఙ్జూచి । యేగుచుంటి
మనసునకు నిచ్చతగులదు । మఱియదేమొ

కాని తలఁపున మెలఁగు । చక్కని వెలంది
బిడ్డలన్బాసి యుంట కీ । యడ్డుతేమొ॥ ౩౬

గీ॥ అనుచు వలవంతఁదూలుచు । నతఁడు రేయి
వడినవేళకు నాదివ్య । భవనమునకు
వచ్చి యాలోనికిన్జొచ్చి । యచ్చెరువుగ
నచటి వింతలుగని యిట్టు । లబ్రపడియె॥ ౩౭

సీ॥ కమలాకృతియుఁ జుట్టు । కైవార మరకోసు
గలిగి యేడంతస్థు । ములఁ జెలంగి
మొదటిదౌ నంకణమున । కేనురెండు నా
పయిదానికాఱెట్లు । వరుసతోడ
నొక్కొకటియె తగ్గి । యుండె గదులలెక్క
తనరు నంతరవు నం । తరువుక్రింద
నొక్కొక్క బలుకంబ । మూఁతముగా నిలు
వున కొండువన్నియ । పొల్పుమీఱు
ధాన్యరాశులకుఁ దొలియం । తస్తు నీటి
యంత్రముల కవ్వలదియు మూఁ । డవదివంట
కావలది యారగింపుల । కైదవయది
సభకు నాపైది శయ్యక । చఱనకుఁదుదది॥ ౩౮

శా॥ ఔరా యేమి మహాద్భుతంబిది నిజం । బా చిత్తవిభ్రాన్తియా
యేరీ యెవ్వరు గానరారిచట నూ । హింపన్గ శక్యంబు కా
దే రాజ్యంబుననుంటినో యెవరిదో । యీసౌధరాజంబు నా
నారత్నాంచితమై తమంబుడిపి యా । నందంబుగావించె
డిన్॥ ౩౯

గీ॥ అన్నియంతస్తులందున । నతుకులేక
వెలయురతనాలు బలుకంగ । ములుగ దూల

ములుగ గోడలుగాఁ దిన్ని । యలుఁగ బళిర
యిట్టి వింతలు మఱియు నెం । దేనిఁగలవె॥ ౪౦

క॥ ఎచ్చోటనుండి చూచిన
నచ్చెరువుగ మేడయెల్ల । నగపడెడుఁగదా
యచ్చఁపు రతనంబగుటం
బెచ్చుగ నిదియిట్లు మాఱు । మెరయుచునుండెన్॥ ౪౧

క॥ అవురా కిఞ్చిద్భోగో
భవిష్యతి యనన్గ నిచట । స్పష్టంబయ్యెన్
దివిజేశ్వరునకయిన నీ
భవనోన్నతిఁ బొందనెట్లు । ప్రాప్తంబౌనో॥ ౪౨

మ॥ నరులా కార నిమేష భావమిచట । న్గాన్పించుట న్వేల్పులౌ
దురు నన్నెవ్వరు పల్కరింపరిదియే । దో మాయ కాబోలుఁ బా
పురె యిచ్చోఁ బనులెల్లఁజేయుటకుఁ గీ । ల్బొమ్మల్గడంగె న్బొరిం
బొరిఁగా లోచిత రాగతాలముల స । మ్మోదంబుకావింపు చుఁ॥ ౪౩

గీ॥ అనుచుఁ దుదిమిద్దెపైనుండి । యాఁతఁడు మగ
యాఁడు బొమ్మలవింతల । నరయుచుండ
గొంత లోపల గంట కం । గుమని మ్రోఁగె
వెంటనే మేడలో వింత । వెలుఁగుతోఁచె॥ ౪౪

గీ॥ చుట్టు చెలువలు గొలువఁగ నొంపుతోడఁ
జెలఁగు తనముద్దుకోమలి । చెట్టఁబట్టి
చుక్కలందున రోయిని । ప్రక్కనొప్పు
చందురునివలె నొకపాదు । సాహితోఁచె॥ ౪౫

క॥ అద్దివ్యపురుషుఁడత్తఱి
సుద్ది న్దలకంబులాడి । జోటులుకొల్వన్
ముద్దియ చేతిన్గొని తుది
మిద్దెకుఁజని వేల్పుబత్తి । మించినుతించెన్ ౪౬

ఉ॥ కారణకారణంబ త్రిజ । గత్పరిపాలక విశ్వరూప సం
సార విదూర ఘోరకలు । షఘ్న దయాంబుధి సర్వజీవనా
ధార యశోవిహార విబు । ధస్తవనీయ చరిత్రభక్త మ
న్దార నమోఽస్తుతే యనుచుఁ । దత్పరుఁడై యతఁడంత
దిగ్గునన్॥ ౪౭

గీ॥ పలుకులెవ్వియు లేక భ్రమా । న్పడినవాని
నార్తిమూర్తీన్భవించిన । యట్టులున్న
దిస్సమొలవాని మిక్కిలి । డస్సినొలయు
బాటసారిని గన్గొని । పలికెనిట్లు॥ ౪౮

మత్తకోకిల॥ ఔర యెవ్వఁడవీవు నివ్వెర । నందకెంతయు
మిద్దె నే
తీరునన్జొరఁగల్గినాడవు । దిగ్గునన్మముఁ జూచి క
న్నీరువంచెదవేల నిన్గన । నెమ్మిపుట్టెను మాకు నీ
యూరుపేరు వినన్గవేడుక। లూరుచున్నవి తెల్పుమా॥ ౪౯

క॥ అని దువ్వలువ నొసఁగిన
న్గొని మొలపై బిగియుఁజుట్టు । కొనిలేచి యతం
డనె నాయేలికతోఁ గ
న్గొనలందున వేడినీరు । గొబ్బునజాఱన్॥ ౫౦

మ॥ అనఘా యేమనితెల్పువాఁడనినుఁగ।న్నారన్గఁగన్గొన్నయం
తనె దారాత్మజులున్నచోటు వెదుక । న్గఁబోయె
శోకంబు నె

మ్మన మాశన్గొనసాగెనంగములకు।న్మాగల్ శ్రమంబుల్దవ్వుల
య్యెను సుస్వప్నము నిక్కమౌనటుల నెం । తే ధన్యత
న్బొందితిన్॥ ౫౧

క॥ మున్నిటి నావ ముప్పునఁ
జిన్నికొడుకుతోడ ముద్దు । చెలియతొలంగ
గ్గన్నిటఁ గొండదడుపుచు
నెనొ్నయిక్కట్ల దాఁటి యే । నిటులుంటిన్॥ ౫౨

గీ॥ అనుచు నిట్టూర్పుల్ నిగుడింప । నతఁడు మిగుల
జాలిగొని బాటసారి కె । గ్గేలుపట్టి
తండ్రి నీవలె నీవారు । తప్పిబ్రతికి
రేమొ సైరించు ముందు మే । లెనయువచ్చు॥ ౫౩

క॥ తెలివిన్గొని కడచిన యది
కలవలెఁదలపోసి హాయిఁ । గను మనిమఱపు
గ్గొలిపించు వింతపూఁదే
నెలఁజొక్కజ్జేసి యాత । నిన్దోడ్కొనుచున్॥ ౫౪

గీ॥ కుడుచుమిద్దియకాదొర । గొబ్బునఁజని
చేడెలగ్గూడి ముచ్చట । లాడుకొంచు
అదటునన్మించి పలుచవు । లారగించి
యాటపాటల వెన్నెల । బైటనుండ॥ ౫౫

సీ॥ సన్నపుఁవెలుఁగుతోఁ । గిన్నెర జతచేసి
ఱేఁడుపొగడఁ బాటఁ । పాడునొకతె
యదిగొఁ జందరుఁడు నా । కందె చూడుఁడియని
యేలికమోము ము । ద్దిడునొకతెల్
చెల్లరే వెన్నెల । చీరెగట్టితినని
తొడవులూడిచి నవ్వఁ । దొడఁగునొకతెల్

యీఁతలో నాతెవ్వ । రెనయని నున్నని
రతనంపు దిన్నెపైఁ । బ్రాఁకునొకతుక
కోయిలల వెక్కిరింపుచు । న్గూయునొకత
యెద్దియో తలపోయుచు । నేడ్చునొకతి
యేమియల్లరియని కనుఁ । బ్రాము నొకొత
సోలియాడెడు నొక్కతె । చొక్కునొకొతె॥ ౨౬

ఉ॥ చల్లనిరేయి తెమ్మెరలు । చక్కిలిగింతలువెట్ట వెన్నెల
ల్చల్లఁగనవ్వ నెచ్చెలియ । చక్కనిమోము మగండు
నిండు జా
బిల్లిగనెంచి సందియము । వీడఁగ ముద్దిడి యందు నిక్కువం
బెల్ల నెఱింగియున్దమి నొ।కింత పరాకుననంటుమాటికిన్॥ ౨౭

గీ॥ ఒడళు తెలియఁగక వేడ్కల । నోలలాడు
వారివలెఁదానుగూడఁ దా । ర్మరుపడుచు
తలఁపులోనున్న చెలియ ద । వ్వులఁ జెలంగు
పగిఁది బొరపాటుతోఁడఁ । బాటుచెంది॥ ౨౮

శా॥ ఏమే యెట్టులవచ్చినావు పసివాఁ। డెచ్చోటనున్నాఁడ హా
స్వామీ ప్రాణము మళ్లిచేరినటుల । న్వచ్చెన్గదా చెల్వ య
న్నామోదంబునఁ గౌఁగిలించుటకు డా । యన్దెల్వితో
నాసవం
బీ మోసంబొనరించెఁగాని చెలి యే । దీ యన్చుసిగ్గొంది
నన్॥ ౨౯

క॥ కని యందఱొక్క మొగిఁ బ
క్కున నొండొరుఁగాంచి నవ్వు । కొనిరంతట మిం
ట నణఁగసాగె న్జుక్కలు
వెనువెంటన్జందమామ । వెలవెలఁబాఱన్॥ ౩౦

సీ॥ ఒంటిపాటునఁ బొక్కి । యురువయి కెంపెక్కి
విన్నుతూర్పునఁదూఱె । వేగుఁజుక్క
ఱెక్కలు జాడించి । ముక్కును గోడించి
కొక్కొరోకోయని । కూసెఁగోడి
నీటితావులఁదాటి । తోఁటల గడితేటి
యొడలు చల్లనఁజేయు । చుండె గాలి
మైదుజాముల పద్దు । గాఁ దోఁచునిఁక(బొద్దు
పొడమెడునని చాటఁ । దొడఁగె గంట
పట్టులెడఁబాసి పిట్టలు । బయటఁబాఱెఁ
దలలు ఱిక్కించి మొక్కలు । చెలువు మీఱె
బలిమితోఁడుత నిద్దుర । బరువుజాఱె
దెబ్బన న్వేసవి (న్రేయి । తెల్లబాఱె॥ ౬౧

గీ॥ అంతఁ దనయింతిఁ బాలకి । యందున దొర
చెలులు గొలువంగ నగరునఁ, జేరఁబనిచి
యదివరకె పిల్వవచ్చిన । యడవి వాం(డ
నగపఱచి బాటసారితోఁ । ననియెనిట్లు ౬౨

శా॥ కంఠే వేఁటకుఁ బిల్వవచ్చిరిపుడే । గన్నోఁపులువేరమ్మ వె
న్వెంట న్గుఱ్ఱమునెక్కు మంచొక ప । టాణిన్జూపిపే
రిఁటెకే
ల్దంటన్బట్టుటనేపిఁ మైమఱువుల । న్దట్టంబుగావించి బ
ల్బంటుల్జాగిలముల్గడంగి యిరు(కే।వల్గాచియేతేరఁగన్ ౬౩

గీ॥ తానునొక్కవింత । తరబడిగుఱ్ఱంబు
పైఁదుఱంగలించి । బయలుదేఱి
గడియలోన మేటి । కాఱడవికిదూటి
బాటసారితోడఁ । బలికెనిట్లు॥ ౬౪

మ॥ చెలికాఁడా యదె కొమ్ముపంది బురద।న్జిట్టాడి యీవైపు పే
రలుక న్థూపువలెన్గడంగెడు రవం। తైనన్ది గుల్వొంద క
వ్వల చే యీఁటియఁబట్టుమంచుఁ దనవా। ర్వంబునన్వాడి
న్దూఁటియా
దలపై దాఁటఁగఁజేసి వెంబడిఁబిఱుం। ద న్బల్లెముగ్రుచ్చి
నన్॥ ౬౫

క॥ మెడత్రిప్పలేక బల్లెము
తొడలోని మురుకొనుచదియుఁ। దునియలుచేయన్
వడి నీఁటెఁగ్రుచ్చి దాని
న్బడవైచె న్బాటసారి। ప్రభువౌ ననఁగన్॥ ౬౬

ఆ॥ అంతలోనొకండ। హా పాదుసా కోలు
పులి యదిగొ గొరక। పోతునొడఁ
గఱచి వాకలోనఁ। బఱచుచున్నది యని
విన్నవింప ఱేఁడు। వేడ్క మీఱ॥ ౬౭

మ॥ బళిరా ఱేఁచులు జాగిలంబు లుసికొ। ల్పన్జేసిపోనీకుఁడా
పులినంచు న్జెలికానితో మిగులఁ ద। న్పునొప్పొంది బాఁకు
ల్తుపా
కులు చేఁబట్టి బిఱానఁబోయి యచట।న్గొంకేమియున్లేక క
న్నుల నిప్పుల్గురియించు బెబ్బులియెద। న్దూయన్గ గుండే
సినన్॥ ౬౮

క॥ ప్రేటువడియుఁ బొగతోడఁనే
మీటినటుల బాటసారి। మెయిదాఁటన్బె
రీఁటె పులినోట నాటుచు
మాటెనతఁడు తన్నుమేటి। మాటికిమెచ్చన్॥ ౬౯

ఆ॥ ఇట్లు వేఁటనెఱపి । యేపారు బడిలిక
లడఁపఁ బానకంబు । లాని గుబ్బ
ములను మాచిన్ యెక్కి । ప్రోలున కరుగుచు
బాటసారికిట్లు । పలికె వేఁడు॥ ౬౦

క॥ ఓయన్న యింతవాఁడవ
నీయోర్పు న్లావు తెంపు । నేర్పు న్గంటిన్
నీయడిగినదెల్ల నిడెద
హాయిగ నాయొద్ద నుండు । మా యిఁకమీఁదన్॥ ౬౧

క॥ ఎనిమిది యామడల వెడలు
పున మఱియంత కిరువెట్లు । పొడవున నీనే
స్తుని పట్టు మెట్టులుండెనొ
కనుమా నలుకడలఁ గడలి । గాచుచు నుండన్॥ ౬౨

గీ॥ దొడ్డకొలనుండె నిక్కొండ । తూపునందు
నదియు నీకంటఁబడవచ్చు । ననుకొనిమెద
నందులోఁబుట్టి పట్నము । నంతఁజుట్టి
మించి యాపెద్ద యేఱు పం । డించుచుండు॥ ౬౩

క॥ నిన్న మనమున్న మిద్దియ
యెన్నండికొండఁ దొలిచి । యెవరొనరిచిరో
యెన్నన్నాలము మేమది
యెన్నెన్నో తరములబడి । నేలుచు నైనన్॥ ౬౪

గీ॥ ఇంకఁబల్లంబు చేరితి । మిటకు నాలు
గామడల మేర మనకోట । యలరుచుండు
గడియలోఁ గాల్వపైఁ బొగ । పడవమీఁద
నేగుదమురమ్ము వడిగఁ । బ్రొద్దెక్కకుండ॥ ౬౫

ఆ॥ అనుచుఁ దన్నుఁగూర్చి । తన పట్టముగుఱించి
బాటసారితోడఁ । దేటపఱిచి
యతనిఁ దోడుకొనుచు । నాదొరయేగు నా
యేటికాల్వకుఁ గుడి । యెడమలందు॥ ౬౫

లయగ్రాహి॥ నింగికిఁ జెలంగి తుద । లం గలిసి పందిరి వ
లెం గడఁగి నీడల నొ । సంగు బలుపోఁకల్
సంగడి నెసంగి నల । వంగముల కొమ్మలఁ బె
నంగి కొనసాఁగు విడె । ముం గొలుపు నాకుల్
రంగు మెయిఁబండుగొల । లం గలిగి నిచ్చెనలఁ
ముంగలఁ బొసంగఁజలు । వం గొనుచునంటు లెన
యంగ బరపొపలు తె । ఱంగులగు మ్రాకుల్॥ ౬౬

చ॥ చెలువుగఁ గాచు వేర్పనస । చెన్నఁగి కొబ్బరిబార్లు రేవుల
న్బొలుపుగ మేటియుయ్యెలల । పోలికనూడలడించి మించు మ
ఱ్ఱులు దమయున్కి చెప్పఁగ మ । ఱుంగగు వాడలు నూళ్లు పల్లెలు
న్వలసలు చావడుల్మఱియుఁ । బచ్చని పైరులతోఁ బొలంబులున్॥ ౬౭

ఆ॥ కనుచుఁ బడవ కాల్వ । కట్టలలోఁ దూఱి
మబ్బులందుడాఁగి । మఱల మఱలఁ
దోఁచు ప్రొద్దుపగిఁది । ఁదొడరఁగ నివ్వాళి
పట్టువారికెల్లఁ । బసిఁడినిడుచు॥

చ॥ చనిచని మన్నెఁకాడు తన । సంగడికానిని జూచి నెయ్యుఁడా
కనుమదె పెద్దయేఱడవి।త్రైవడి నోడల మిన్ను ముట్టుచుం

డ నెటుల నైదుకోసుల వె । డల్వాయి యొడ్డులుతీసి
పారుచుం
డెనో యెటులన్నిరంగులు వ । డిన్మనరాకకు ద్రోఁగు
చుండెనో॥ ౮౦

ఆ॥ అనుచుఁ జెప్పుచుండు । నంతలోఁ జెనుచోఁఱ
వలెఁ దమ పొగపడవ । పట్నముదరి
గొనఁగ నాల్గుజోళ్ల । గుఱ్ఱములూన్చిన
బండిమీఁద వారు । బయలుదేఱి॥ ౮౧

సీ॥ ఆమడ చదరమై । యంతట నేటి నీ
రుఖికించు పెన్మర । లొప్పుమీఱఁ
బెద్దమేడలు కల్గి । విధివిమై దిద్దిన
యట్లు తిన్నని వాడ । లంధమార
మిన్ను గప్పుచుఁ బొగ । మేటి మబ్బులవలెఁ
జెదరి యంగళ్లపైఁ । జెలఁగుచుండ
సందు వెట్టఁగనీక । యందఱు న్బాజారు
కడపల రాక పో । కల నొనప౯
బిచ్చగాండ్రును వెలయాండ్రు । పేరునకయి
న న్గలుగక వెలయుచుండు । నగరునందుఁ
దనరు వింతలు పేర్వేరఁ । దనహితునకుఁ
జూపుచా దొరయేగెడు । చొప్పునందు॥ ౮౨

చ॥ తెరువు నొకింతలేక చను । డెంచెడు మూఁకఁదొలంగఁ
బుచ్చు బ
ల్తురికి వటార్లయాపుఞలు త । ళుక్కున నెండకుఁబొల్చు
సన్నుల

న్వరఁగు తుపాకులూనిన సి । పాయి దళమ్ముల జోక్ల
చప్పుడు
లొప్పిఁబొరి బూరతా రవళు । లున్విను చక్కటిఁ బిక్క
టిల్లఁగ॥ ౧౩

సీ॥ తడఁబడి కొప్పులు । సడలఁగఁ బయ్యెద
యెడల మేడలపయి । కెక్కువారు
కనులారఁజూచి దీ । వన పాటపాడి దో
సిళ్లతోఁ బూవులు । చల్లువారు
పట్నమునందలి । పడఁతులకు న్దంద్రి
వలెఁ గోకలిడునంచు । నలరువారు
తగవు నొక్కింతయు । న్దప్పనొల్లఁడు నిజ
ముగ వేలుపితఁడని । మ్రొక్కువారు
నోము దొరసానిదేయని । నొడవువారు
సొగసుఁగాంచి విఠాకునఁ । జొక్కువారు
నగుచుఁ జెలువలు గనుచుండ । నాఁతడంత
లోన మెల్లనఁ దనకోట । లోని కరిగె॥ ౧౪

క॥ ఆకోటకు నల్దట్ల
ప్రాకార మగడ్తయు న్గొ । ర నసాధ్యములౌ
ఆకోటలోని మేడలు
గైకొన్న సొగసులఁ బొగడ । గ నశక్యములౌ॥ ౧౫

ఆ॥ అట్టి నగరిలోన । నరుసువలె న్బాట
సారి కొల్వఁబడుచు । సంతసంబు
వడయఁజాలక దొర । కడ కొక్కనాఁడేగి
కనుల నీరువంచు । చనియె నిట్లు॥ ౧౬

మ॥ అకటా రోగికి విందొనచుఁ నటులీ । వందించు
భోగంబు రి
త్తకదా చెల్వనుబాసి మేటివలవం । తన్నుందు నీ సంగడీ
నికి రాజోత్తమ యాతఁ బాన్ధవుఁడవౌ । నీపెర్రిపు
పోనాడి నే
నిక నెందేగుదు నాలుబిడ్డల మతే।నే తీరున న్గాచెదఁరాఽ

సీ॥ తాను ముందుగలేచి । తానము గావించి
పొందమ్మివలె నాకు మోముచూపు
నిల్లు నీటుగఁజేసి । యెంతయున్గ్రొంజవు
లూరు వంటలు కడు । పార మేపు
నేఁబైకిఁజని మళ్లి । యేతేర నాయడు
గులఁబట్టి నిమిరి బ । డలికఁబాపు
నామాట కెన్నఁడై । న న్గవదాఁటక
నానేరమెట్టిది । యైన నోపు
కలిమిలేముల నిల్లొక్క కరణిజరపు
నన్నిటికి నెక్కుడంచు । మర్యాద నెరపు
గరము బీదలపైఁ గని । కరము పరపు
నట్టి యిల్లాలిఁ బాసి నే । నెట్టు లుందు॥ రాఽ

క॥ అని వగచు బాటసారి
న్గని యెకిమీఁడూరడించి । కనికరమున ని
ట్లనె నన్న యింక నడల
న్బనిలేదొక మేలుమాట । పలికెద నిదిగోన్॥ రాఽ

గీ॥ పట్నము న్జేరునపుడె నీ । వారికొఱకు
నరయఁబంపిన బంట్లెల్లఁ । దిరిగివచ్చి

చల్లఁగా నీపడంతియు । న్బిల్లవాఁడు
బ్రతికి నారంచు నిప్పుడే । పలికిరి చుమి॥ ౯౦

క॥ అనిచెప్పిన విని సందియ
మును వేడ్కయు నబ్బరంబు । ముప్పిరిగొనఁగా
మనసునఁ దడఁబడి యెద్దియు
ననఁజాలక కొంత నిలిచి యతఁడిట్లనియెన్॥ ౯౧

శా॥ నన్ను న్బెంచిన తండ్రి నాయొడయఁడా । నాపాలి మేల్వేల్పు వా
రున్నారా యెటులైననుం బ్రతికి తా । మున్నార యెందున్నవా
రెన్నండిచ్చటి కేగుదెంచెదరు బం। ట్లింకెట్టుల న్జెప్పి నా
రన్నా నాకొకమాటలోన సెలవిమ్మా యంతయు న్మ్రొక్కెదన్ ౯౨

గీ॥ అనుచుఁ దత్తరపడుచుండు । నతనితోడ
నరుసిటులఁ బల్కెవిను సంది । యంబువలదు
మనమిటకు రాకమున్నె నీ । మగువవచ్చి
యెద్దియోవ్రాసి చనినట్టు । లేనువింటి॥ ౯౩

క॥ అనిచెప్పి యమ్మగండా
తనిఁ దోడ్కొని యోడరేవు । దాపున నింపొం
దిన గంటకంబమునకు
న్జని యందలి వ్రాఁతనిట్లు । చదువఁదొడంగెన్॥ ౯౪

చక్కెర॥ వెనుగాలి నోడమున్నిటఁ గొండపై । విడిచెదన్న
వెనుకొన్నయింకెదో నావ యందఱ । న్బనిచితెచ్చె
ననుఁగట్టుకొన్న యాతండొకండె క । న్పడకయుండె
నినుగొల్తుఁ గంబమా వానిఁ గాంచిన। న్వేదకఁబంపు॥ ౯౫

గీ॥ మేటి యిటుచదువఁగ విని । చాటుసారి
తాను నొక నూఱుమూఱు ల । ద్దానిఁజదివి
ఆమె గుఱ్తులు చెప్పుఁడీ! యని యడిగినఁ
గొండఱచ్చట నిట్లు పే । ర్కొనఁదొడఁగిరి॥ ౯౬

చ॥ పిఱుఁదుల మీఁఱ యుంగరపుఁ।బేర్లవలెన్దఱ చొంది జారుమే
న్నెఱ సవరింపఁ బోక మెయి।నిండఁగ మాసిన చీరగట్టి పె
న్వెఱపునఁ జూచు లేడికర । ణి న్నలుతట్టులు గాంచు
చూర్పు ల
న్నెఱపుచు బల్దిగుల్వడెడు । నీ యెలపాయపు టింతి
కన్పడెన్॥ ౯౭

గీ॥ తెలి మొగలిపువ్వు లేఁత రే । కుల తళతళ
గలుఁగు చెక్కిళ్లనుండి వా । ల్కనుల నీరు
వలుద ముత్తియములవలెఁ । బడుట నీదు
చెలువ వలవంత కొకవింత । చెలువు దెచ్చె॥ ౯౮

క॥ వినుమిటకు డాకడ న్పది
నెనిమిది యామడలమేర । నెఁసగిన పట్టం
బున కీచటి నరకుల న్గొనఁ
జనుదెంచిన యోడ నీదు । చాన న్దెచ్చెన్॥ ౯౯

గీ॥ నెలపొడుపునాఁడు నీముద్దు । చెలువ యిచట
దాది యొక్కతె చిఱుత నో । దాచుచుండ
వంటకంబులఁగొని యిది । వ్రాసి దీనిఁ
గాపుఁడని మాకుఁ జెక్కు రా । క లిడి చనియె॥ ౧౦౦

క॥ అని నమ్మకంబు పుట్టిం
పనఁ గొండతెఱఁగునఁ బొంగి । చెలియకనులఁ గ

ష్టినమాడ్కిఁ దోఁప నొక కొం
తనిలిచి యాబాటసారి । తలపోసె నిటుల్॥ ౧౧

ఆ॥ కట్టుకొన్న చెలిమి । కట్టులఁదప్పితి
నట్టుకొన్నవాఁడ । నెట్టులైతి
గట్టరాని మనసు కట్టి । బ్రిదికితి ని
నట్టు కొన్నవాఁడఁ । గనుకఁజెల్లె। ౧౨

గీ॥ జోటి బ్రితికినదని నాకుఁ । దేటపడియెఁ
గాని నాయున్కి నెఱుఁగ ద । చ్చాన యకట
పిట్టవలె నాకు ఱెక్కలు । వెలయునేనిఁ
బడఁతిఁ గనకుందునే ఱెప్ప । పాటులోన॥ ౧౩

చ॥ అని తలపోయుచు న్వగచు । నాతని నేలిక బుజ్జగించి యి
ట్లనెఁ జెలికాఁడఁ నీదు చెలి । యన్ననుఁగొందువు సైఁచు
మంచు నాఁ
డనినది నిక్కమయ్యెను గ ।దా యిఁకఁగుందకు నిన్ను
నంపు దా
పున నొకమేలు నీవలన । ఁబొందికగావలె రమ్మి చెప్పె
దన్॥ ౧౪

గీ॥ ఇట్టులా యరు సాతని । న్దిట్టపఱిచి
కోటలోనికిఁ దోడ్కొని । కొంతతడవు
వేడుకలఁబుచ్చి యవ్వాని । తోడ నొంటి
నరిగి యొక పూవుఁదోఁటలో । నసియె నిట్లు॥ ౧౫

క॥ కనఁదగిన వింతశాస్త్రము
తనంత జతపడినయప్డు । తత్వజ్ఞుఁడు పొం
గునటుల నినుగన్నది మొద
లనఘా నీ హితుఁడులోన । నలరు న్జుమ్మీ॥ ౧౬

గీ॥ అదిగో వచ్చెడుఁ జూడు నా । యన్నకొడుకు
చెలఁగి కోల్పులి నాడించు । జెట్టి మిన్న
తండ్రి కెక్కుడుగా నన్ను । దలఁచుచుండు
నెల్ల చదువులు నేచు౯ నీ । పిల్లవాఁడు॥ ౧౦౭

సీ॥ మా వంగడము పాడి । నే వినిపించెద
నన్నదమ్ములు పెద్ద । పిన్నవరుసఁ
బరఁగి యేల్పడిచేయ । వలయును నాయన్న
యేలి పట్టంబు నా । కిచ్చె నేను
వీనికి నొసఁగెద । వీఁడు నాకొడుకుల
కిడెడుఁ గాపుగడ యి । ట్లెసఁగఁ బొసఁగు
నిరువది యైదేండ్ల । కేలికయై పెత్త
నంబంతదనుక నో । నప౯ఁదగును

ఏమ్మట న్మనమానాఁడు । విడిసియున్న
కొండపై కేగి హాయిగా । నుండునొప్పఁ
పెద్దలేపా౯టు సల్పిన । దిద్దుపాట్లు
తెలుప నాలింపుమా వేల్పు । కొలుపుఁగూర్చి॥ ౧౦౮

మ॥ కలయందెత్తెడు మేనుతోఁ జెడు జ । గత్కార్యంబులు
న్జిత్త స
ఞ్చలత న్వాస్తవమందుచందమున నీ । సర్వప్రపం
చంబు న
ఞ్జాలకు న్నిక్కముగాఁ గనన్బడెడుఁ బ్రా । జ్ఞు ల్పూర్ణ
భావంబు ని
శ్చలమౌట న్దమకన్న వేఱుగన రీ । శత్వంబు బ్రాపించు
చు౯॥ ౧౦౯

ఆ॥ కౌచు ముట్టుకొనరు । కలనైన మావారు
మేలెకాని కీడు । జోలిపోరు
కల్ల పెద్దతప్పుగాఁదె । గడన్పడుఁ
బరువు నయము మాకు । బ్రతుకుకన్న॥ ౧౧౦

క॥ మా మతమన్న న్గిట్టని
మామయొకండుండె మేన । మామ యితనికిన్
నీ మగువయున్న పట్నం
బేమరఁబో కేలునాతఁ । డెక్కుడుదొంగౌ॥ ౧౧౧

క॥ అతడు జగడంబిప్పుడు
మాతోడ న్పెట్టుకొనియె । మనసుల యెరుసల్
మాతెరువులు రెండు నెడం
బై తిన్నఁగఁ గలియ వట్టు । లైనన్దప్పన్॥ ౧౧౨

క॥ గుడి యను పున్బడిదాణము
పడంతి సుంకంబు । నేలుబడి పట్లచోఁ
మడి మైలలంచుఁ బిల్వ
న్బడు నీరు న్విప్పు లపటి । పాలచేతల్॥ ౧౧౩

గీ॥ అన్న విను లేకలేక యూ । యరుసున కొక
మాఁకురొవవెను నామేన । గోడలదియు
వీఁడు నొకచోటఁ దమచిన్న । నాఁడుకలిసి
యుంట నొండొరులఁ దవిలి । యుండిరిపుడు॥ ౧౧౪

క॥ అన్నిట నీడున్జోడు
న్గన్నారి చిరుతలకట । కట్టడి దయ్యం
బెన్నఁడు జతగూచెడునో
యన్నా యీరాచరికమె । యడ్డయ్యెఁగదా॥ ౧౧౫

గీ॥ ఒంటిపోటునఁ గ్రుమ్మరు । చుండు మదపు
టేన్గువలె నాఁకలి నిదుర । లెఱుఁగ దక్క
టకట యాసీమ కొంటిగ । నరుగఁదలఁచి
సైచకున్నాఁడు నాకేమి । తోఁచకుండె॥ ౧౧౬

గీ॥ బలము సంగీత సాహిత్య । వైభవంబు
చక్కఁదనము స్వతంత్ర రా । జ్యంబు లేఁత
ప్రాయ మలరారు వానిఁ ద । ప్ప మఱియెవనిఁ
గట్టుకొన నొల్లనంచు నా । కన్నె నిలిచె॥ ౧౧౭

ఉ॥ ఇన్నియుఁ గల్గినట్టి యొకఁ। డెందున నీతనికన్న లేమి నా
కన్నియ తానెఱింగినది। కావునఁ దండ్రికి నట్లుచెప్పె నం
తన్నలుదట్ల రాజుల క । తండది వెల్లడిచేయఁ బంచె నో
యన్న యిఁకైదునాళ్ల గడు । వై కనుపించెదుఁజుమ్ము
పెండ్లికిన్॥ ౧౧౮

గీ॥ అకట నాయన్న యితని నా । కప్పగించె
నేను నీకొప్పఁజెప్పితి । నీ కొలంది
యెఱిఁగి యటుగాన మీర లి । ద్దఱు గడంగి
తెరవ లన్గూడి బిరబిర । న్దరలి రండు॥ ౯౧౧

క॥ మీ రేతెంచిన తోడనె
నారాజ్యంబన్న కొడుకు । నకు నిచ్చెద నా
త్మారాములమై యడవి
న్జేరి మనము పిదప ముక్తిఁ । జెందఁగ వలయున్॥ ౧౨౦

ఆ॥ అనుచు బాటసారి । కా నేలజేఁడన్న
కొడుకు నప్పగించి । గడుసు బంట్లఁ
దోడుచేసి యేటి । యోడరేవు వఱకు
నంపకంబుపెట్టి । యరిగెనంత॥ ౧౨౧

క॥ కట్టెడలి కదలి మేల్కొని
బెట్టిదముగ నావులించి । పెన్బొగ తెగయన్
నట్టేట న్బడి పర్వులు
పెట్టె న్బెరోడ మిగుల । వేడుకపుట్టఁ॥ ౧౨౨

ఆ॥ అపుడు బాటసారి । యా రాచపట్టితో
నోడ చిత్తరువుల । తోడ వేడ్క
నందలేని తనదు । డెందము న్దెలుపుచు
ననుఁగుఁదనము దనర । ననియెనిట్లు॥ ౧౨౩

క॥ ఓడక పెంపుడు సింగఁపుఁ
గోడెవలె న్వచ్చెదీవు । కొమరుఁడ వకటా
జోడయిన చేడియల విడ
నాడి యునికి మనకు నొకటి । యై కన్పట్టెన్॥ ౧౨౪

శా॥ అన్నా కన్నెతనంబునుండి తగులై యాముద్దరాలెంతయు
నిన్ను న్గన్గొనునంచు వింటిఁ దనకు న్నీ వేడ్కదెల్పన్గ నీ
కెన్నండేయది యానవాలిడియె నీ । వీతీరు చేడ్పాటుతోఁ
జెన్ను న్దూలుటతేలనా మిగుల రా । సింగంబు తామచ్చి
కన్॥ ౧౨౫

ఆ॥ మీఁదఁ గొండలోరగ । మేల్కనియు న్నిదు
రించునట్టి మనసు । రెచ్చ ముద్దు
గుమ్మయంపినట్టి । కమ్మఁజేకొని చవు
లూరఁజదివె బాట । సారి కిట్లు॥ ౧౨౬

క॥ వలపు న్దెలుపఁగఁ జాలదు
కలమ్ము మన చిన్ననాటి । కలసి మెలఁగుటల్
తలఁపునకు వచ్చినయెడ
న్నిలుచు న్నాయుసుఖు దాఁప । నేరన్బావా॥ ౧౨౭

ఆ॥ వావి మేనఱికము । పసితనంబున నుండి
చనవుచేఁత యెంచు । కొనిన సొమ్ము
దవ్వులయ్యె నిండు । జవ్వనపు న్గోర్కి
కఱవుదీఱ నెపుడు । కనెద నిన్ను॥ ౧౨౮

గీ॥ మన తగులమున నీ మేన । మామ కూర్మి
పూను తెన్నున నేపుఁజూచు । క్కాని మలపి
గడియ లోపల నెడఁబాటు । కడలిదాటి
రమ్మ నీ కల్మి బల్మి బిం । కమ్ము లలర॥ ౧౨౯

క॥ పలుములుఁ దనపై నీచూ
పులు వాఱఁగ నీదు డెంద । మున్గొని నీచే
తులనంటి ముందుగాఁ బెం
డిలి నీకి సవతి కమ్మ । నేపుఁ జుమ్మా॥ ౧౩౦

సీ॥ చిలుక బూచులకుల్కి । జిలిబిలిగాఁబల్కి
సాఁబాలుగాఁ దిన్న । చల్దిబువ్వ
చిఱు జగడములాని । బిఱబిఱఁ బొత్తూని
తనివితీరక యాడు । దాగురింత
పట్టు పంతములాడి । బాగుగాఁ గవఁగూడి
మెలపునఁ బాడిన । మేలుకొల్పు
అంటు జంటగఁగట్టి । దంటగా నీర్వెట్టి
నిలుపు సంపఁగిగున్న । తొలి సమర్త

ఆనవాళ్లవి నన్నుఁ గ । న్నారఁజూప
నేగుదెంచిన యీగాలి । ప్రోగుబొమ్మ
మనసు వచ్చినయట్లు ని । న్మరులు కొల్ప
బొగలుచున్నది నిక్కంపు । బొంది యుచట॥ ౧౪౧

క॥ అని వగమిఱఁజదివి దా
పునఁగల యచ్చెలువ యంద । ము న్దన కన్దో
యి నలఁదు కొంచూర్పుల నిడు
చు నతడు చెలి వాలుకనులఁ। జూచి యిటులనున్॥ ౧౬౨

గీ॥ మొదట వావులెఱింగిన । ముద్దుచూపుఁ
బిదపఁ గురులుంచు దాపున । బెదరుచూపు
పగిలి యెడఁబాయఁజాలని । దిగులుచూపుఁ
గనుల దూబూచి చూపు నా । కన్నెచూపు॥ ౧౬౩

చ॥ అని దిగులందు నాతనికి। సంతట నూచుచు బాటసారి
యి
ట్లనెఁ జెలికాఁడ యచ్చెలువ । నంతకయే యిటు వేగు
చుంటి వే
మనియెద నెల్లవేడుకల । నందఁగఁజేసిన దానిఁబాసి పో
క్కనను దలంచిపైన నిఁకఁ । గుండను చూడుము వేయు
మించెడిన్॥ ౧౬౪

సీ॥ ఆకసంబున నడు । గంటిచుక్కలు రవ
లట్లు చీఁకటినీట । నలరుచుండెఁ
గరఁగిన వెండి నీ । ర్పరపిన తీరున
నలలవాలుగ మీలు । తళుకుమీఱె
మీఁదు క్రిందులఁబొల్చు । మింటి నట్టనడుమ
గారడియద్దమై । కడలి తోఁచె
దొప్ప చేతుల వలెఁ । దూఁగాడు కరడము
ల్గొప్ప చందువల జో । కొట్టుచుండె
చుక్కజాడలఁ బోగమోడ । చొక్కుచుండె
గాడు పెల్లెడల న్జోల । పాడుచుండె

నిగిడి గడియార మిదిగోఁ బ । డ్రెండువేసె
నిఁకఁ జెలిమికాఁడ మనము పం । డు కొనవలయు॥ ౧౩౫

క॥ అని రాకొమరు న్నిదురకుఁ
జొనిపి తనకుఁ గన్నుమూఁత । చొప్పడ కుల్లం
బున నగపడు తనచెలియకు
ననఁగఁదొడఁగె బాటసారి । యడలుచు నిటులన్॥ ౧౩౬

మ॥ తరుణీ కన్గవఁబోలి తెల్విమెడ ని । ద్రన్గొన్న న్భ్రాంతిపా
టరయనోర్చవని నిన్ను నన్నెడపెనే । యక్కూళ
దయ్యంబు కా
ని రవంతైనఁ దొలంగకుండునుగదా । నీరూపు నాలోన న
ద్దిర నాకిద్దిమెచాలుఁ జూచుకొనెద । న్దెల్లంబుగా నెప్పు
డున్॥ ౧౩౭

క॥ నిడువాలు కనులు తీయని
నుడువులు ముంగురులు చెదరు । నుదురు న్మేల్పొ
త్తడిమేను సన్ననడుము పొ
గడఁ దగు నీనడక కనులఁ । గట్టు న్సుమ్మీ॥ ౧౩౮

సీ॥ అడుగులుగంటి నె । న్నడుము వఁడక నీవు
తిరిగి చూడక నీళ్లు । తెచ్చు హొయలు
చెక్కిళ్ల కిరుగడ ల్చివురు । చేతులఁజేచిన్
యొప్పుగా నీవు పొ । య్యూదు తీరు
దాఁతేలు వెన్ను మీఁ । ద న్మోపి నెమ్మేను
వంచుచు నీవు వ । డ్డించు చెల్వు
కొనగోళ్ల నీనియల్లును । ముచు మడుపుల
మచ్చికతోఁడ నీ । విచ్చు సొగసు

నన్నుఁ గనినప్పుడెల్ల నీ । కున్న జోక
నేను జబ్బుగనున్నప్డు । నీ యలజడి
నాదు చుట్టములందు నీ । యాదరంబు
నెందనుకఁ దలపోయుదు । నెట్టులోర్తు॥ ౧౬౯

క॥ ఇదియేమి సోద్దెమో కద
ముదితా నిన్దలఁచి నేను । పొందు కలవరం
బెదకింపై తోచుచు ను
న్నది యిటఁదక్కినతలంపు । లన్నిఁటికన్నన్॥ ౧౭౦

ఉ॥ ఎన్నఁడు నిన్ను గన్దు జెవి । కింపుగ నీనెరముద్దుమాటలిం
కెన్నఁడు విన్దు నక్కట చె । లీ యిపుడెక్కడ నున్నదానవో
నాన్న యఁటంచు బిడ్డఁడను । నప్పుడు నీయెద యెట్టులుండు న
న్నన్న తొలంగుచున్న యును।జానమె పోవఁగ నీకనిప్పుడే॥ ౧౭౧

గీ॥ అనుచుఁ బెక్కు తెఱంగుల । నతఁడు పొగలి
నెగడు నిద్దురఁగడకంటి । నీటఁదుడిచి
అనుఁగుఁ జెలికానిఁ దెలవాఱి । నంతఁదెల్పి
ముచ్చటించె నిటుల వగ । పు న్మఱగించి॥ ౧౭౨

శా॥ అన్నా హాయిగఁ గూర్కవట్టినదియే । యహాఁ జాడుమా యొకను
మ్మన్నీరావియలు విచ్చియుత్తుకొన తెం । తో లోఁతుగాఁ దోఁచు నె
న్నెన్నో కోసులమేర నద్దిర యిదే। మీ కొండలు న్జెట్టులు

న్మిన్ను న్మన్ను నివెల్ల వెన్వెనుకకు । న్వేపర్వుల న్బట్టె
డున్॥ ౧౪౩

చ॥ అదె మనమేగుపట్నమెటు లబ్బురమై పొడకట్టుచుండెఁ బ
న్నిదె మొనరించు గుజ్జమటు । నిల్చిన యోడపయి న్ని
డంబు లో
ప్పిదముగ సన్నలన్దెలుప వేగిరపాటున మిఱ్ఱుపల్లము
ల్గదియుచుఁ జూడు తెప్ప లల । లంబడి యచ్చటి కేగు
దెంచెడిన్॥ ౧౪౪

గీ॥ అన్చు వారలిరువురు వా । కొన్చు మిగుల
నాస యువ్విళ్ళూర సం । తోస మలర
ఓడడిగి పడవలఁజొచ్చి । యొక్క గడియ
కొడ్డునకుఁజేరి హాయిగ । నున్నయంత॥ ౧౪౫

ఆ॥ వారు తమకు నెదురు । వచ్చిన యారాచ
కన్నె చెలులఁగాంచి । కలతెఱంగు
వినఁగ వేడ్కపడఁగ । వివరించి రవ్వారు
తేలుదోయి నొసటఁ । గీలుకొలిపి॥ ౧౪౬

క॥ మమ్మేలు రాచకన్నియ
యిమ్మున్దన పూవుఁదోఁట । మేడఁగలయుఁగా
నెమ్మినరిచి తత్తరమున
రమ్మని యిదె కెంపుటుంగ । రము గుఱుతిచ్చెన్॥ ౧౪౭

క॥ అని చెలులిచ్చిన యుంగర
మును గన్గవ నద్దుకొనుచు । ముద్దిడుకొన్చు
న్పక్కనఁ గదియించుచుఁ దన చిటి
కెన వ్రేల నమచిన్ దాని । కిఁ బలికె నతఁడున్॥ ౧౪౮

ఆ॥ నీపసిండి చెలియ । నెమ్మేని జిగిదెల్పు
నీదు కెంపుమోవి । నిగ్గుదెలుపుఁ
గాని చెలువ మనసు । గనిపెట్టి చెప్పక
యుంటివేమె ముద్దు । టుంగరంబ॥ ౧౪౯

క॥ చెలియేమి చేయుచున్నది
పలుమఱు నిడువాలుకనులఁ । బరపుచు నీతోఁ
బలికిన పలుకులు కలవా
తెలుపుమనఁగ జెంతనున్న । తెఱవ లలరుచున్॥ ౧౫౦

చ॥ తెలిపిరి జేఁడ నీవు చనుదెంచుటకు న్వలనెంచిచూప మా
వెలఁదుక పెంపకంబు పసి । పిల్లని ముంగలఁ గాయ
పండుల
న్నిలుపుచు నీదురాక విని । నివ్వెరతో నొకకొంతనమ్మక
వ్వలనగపచున్ వేడ్క కనుపండుగ చేసెను మా కదెంత
యున్॥ ౧౫౧

చ॥ కలకల నవ్వు వేలుపుల । కైకయిమోడ్చుచుఁ బైట
దిద్దుకొం
చలసట చూపు ముంగురుల । నద్దములో సవరించు దిట్టి
చూ
డ్కులఁబచరించు మమ్ముఁ గనుఁ । గొంటుకు సిగ్గలరించు
నెత్తుల
న్బలుమఱు నూఁచు మాచెలువ । పట్టఁగజాలని వేడ్క
మీఱుటన్॥ ౧౫౨

క॥ అని చెలులు సెప్పి తోడ్కొనఁ
దనివి న్గొని రాచపట్టి । తనకై యేపన్

చిఱ్ఱన క్రొంబూఁదోఁట విడిది
కనుఁగుంజెలికానితోడ । నరిగె బిజానఁ ౧౫౩

ఆ॥ అపుడు బాటసారి । యా రాచపట్టికి
జరుగు వేడ్కఁ జూచి । సంతసించి
యును మఱి తనచెలియ । యున్న చొప్పెటు గాంతు
ననుచు నెమ్మది నను । కొనియె నిట్లు॥ ౧౫౪

సీ॥ కొన్నాళు లడియాసఁ । గొనుచుండు డెందము
చెప్పుచేఁతలకెల్ల । నొప్పియొప్పి
తలఁపని యిమ్ములు । తమయంతఁ జేకూరు
నప్పుడు రానీక । రొప్పిరొప్పి
కొన్నాళ్ళు పొట్టకై । కూర్తికై యందందఁ
దిక్కుమాలిన బొందిఁ । ద్రిప్పిత్రిప్పి
యర్మిలిగనకుఁ డో । యయ్యలారాయని
గొప్ప నావలవంతఁ । జెప్పిచెప్పి
యదియటులఁ గానియెడ నేమి । యాదునేను
మరియు బ్రతుకుటయా మొండి । మొరడువలెను
గాదు మనియెద నింక నీ । మీఁదనేమి
యగును నాపని నానాట । నరుగుటకద॥ ౧౫౫

గీ॥ జగముతో జోలినాకుఁ గ । లుగుటవలన
నామనసు దిట్టపడఁగ నింత । వఱకైన
నిల్వఁజాలితిఁగాని న । న్విడిచి యన్నె
మెఱుఁగని చెలి నాయెడఁబాటు । నెట్లుసైచు॥ ౧౫౬

గీ॥ పిల్లవాని నెవరికేని । బెంపనిచ్చి
యకట ననుజూడఁగల్గెడు । నాసదొఱఁగి

నాగరిత నామనుగడపు । నాఁది పాదు
బలిమిచేత నుసుఱులెడఁ బాసెనేమొ॥ ౧౫౭

క॥ కానియెడ నృగవాలక
మూని మగువ లోన మిగుల, నుడుకుచు నే నెం
దైన నగపడుదునోయని
తానూళ్ల నృబల్లెలందుఁ । దలడిలునేమో॥ ౧౫౮

గీ॥ తలిరుటడుగులలో ముండ్లు । దగిలె నేమొ
పసిఁడి మేనెండ తాఁకునఁ । బడలె నేమొ
పట్టుమెత్తని కురులట్టు । గట్టెనేమొ
నా కనుల పండువింకఁ గా । నఁ బడదేమొ॥ ౧౫౯

సీ॥ నిను బెప్పపాటైనఁ । గనకున్న నోర్వని
కన్నులు కాయలు । కాయవలసె
నీమాటల నగిం । తే విననేరని
ములుచ చెవులు చెట్లు । మొలువవలసె
నీదుపేర్చపిగొంట । నిముసమేనియు మాన
నట్టి నాలుక గడ్డి । గట్టవలసె
గడియసేపయిన ని । న్నెడసి నీరగుచుండు
గుండియ బండయై । యుండవలసె
కటకటా నాదు మేల్మి బం । గారుబొమ్మ
నా బ్రతుకుపట్టు యెచట ను । న్నావొ వాలు
కన్నుఁగవ నీరు వఱదలు । కాచుఁ జెట్లు
కుందుచున్నావొ యిపుడు । నన్నుందలంచి॥ ౧౬౦

ఆ॥ విన్నఁబోయి యిట్లు వెత । చెందు నాబాట
సారి మోముఁగాంచి । జాలిమించి

యపుడు రాచకొమరుఁ । డచ్చెలికానికిఁ
దలఁపు మఱలునట్లు । పలికెనిట్లు॥ ౧౬౧

ఆ॥ అయ్యొ యింకమీద । హాయి మనకుఁగల్గు
నంచు గుఱుతుచెప్ప । నాకసంబు
వేఁడిగాడ్పు వేస । వి న్వాసి చల్లని
మబ్బుఁ గ్రమ్ముచున్న । మాడ్కిఁ గంటె॥ ౧౬౨

సీ॥ తొలితెల్ల కొండల । వలెనున్న మొగుళులు
గొప్పలై నీలిరం । గులఁ దనచెఁ
దూదిపింజెలలాగు । దొడ్డమబ్బులనేకి
కరువలి పఱపులు । గా నొనచెఁ
తెండిచబుకుఁ ద్రిప్పి । వేసిన యట్టులు
మెఱుము తోడుతఁ బెద్ద । యురుముపుట్టె
నేలఁగమ్మని తావి । నెగడించు చందంద
వలుదలై లెక్క చి । న్కులు మొదలిడె
మింటికిన్మంటికిఁ దఱచు । మీఱ వాన
యడుగులను తీఁగెలబిగించి। యూఱవ వడి
పీఁజె వాయించు నెఱజాణ । గాఁబమాడ్కి
నందముల గుప్పి గాలి పా । డం దొడంగె॥ ౧౬౩

గీ॥ వంగియక్కన నొకచిఱు । తం గదించి
చూడు వచ్చెడు నెవతొ యీ । మేడదరికి
జడిసి పిల్లను ఱెక్కలు । చాటుచేసి
పట్టునకుఁ బర్వెడెడు కోడి । పెట్టవలెను॥ ౧౬౪

క॥ అనుచు న్దనమదిఁ ద్రిప్పగఁ
గనుఁగవఁ గనుపట్టనీక । క్రమ్మినసీటిఁ

మునికొంగునఁ దుడుచుకొనుచుఁ
గనుఁగొని యాబాటసారి । కడునబ్రమునన్॥ ౧౬౫

గీ॥ లేచి నిలిచి నిదానించి । చూచి కేలు
దోయి తట్టుచు నెగురుచు । దొడ్డనోట
నదిగొ నాదాది నాయయ్య । యిదిగొఁ గంటి
ననుచు నెదురేగె నేస్తున । కబ్బురముగ॥ ౧౬౬

క॥ అప్పుడు దాదియు నాతనిఁ
జప్పునఁ బరికించి పోల్చి । సరగ ననియె మా
యప్పా నీబిడ్డండిదె
యొప్పుగ నీయాలు నిచట । నున్నదిసుమ్మీ॥ ౧౬౭

ఆ॥ ఇచటి రాచకూఁతు । రెంతయుఁ గూర్మితో
మమ్ముఁ బెంచుచుండె । మామొఱ విని
వెదకి వెదకి విసికి । సొదఁజొత్తు నంచు నీ
పడఁతి నేఁడుగట్టి । పట్టుఁబట్టె॥ ౧౬౮

ఆ॥ పాలు పొంగుచూపి । పైమూఁతలు బికించి
పడెడు పోల్కి డెంద । ముడికి నిదుర
నైన నుబ్బికనుల । యందు నీరైపొర్లుఁ
జెలియ వంత యెంత । చెప్పుదాన॥ ౧౬౯

గీ॥ ఇచట బుడుతనికి సద్ది । యిడుచు నేను
దిరుగఁ జప్పునఁ బెన్వాన । గురియఁజొచ్చె
అంత బిఱబిఱ నీమేడ । చెంతఁజేరఁ
గంటఁబడినావు మానోము । పంటవలెను॥ ౧౭౦

క॥ అని చెప్పినఁ దత్తఱపా
టు నెమ్మి యబ్బురమతఁడు క । డున్గని తన మే

ల్వినిపించు మనుచు నద్దా
ది నాలికడకంపి చేరఁ । దీసి కొడుకనిన్॥ ౧౬౧

ఉ॥ అక్కునఁ జేచున్ ముద్దిడు న । హాయని ముచ్చటలూరుఁ జిన్నినా
చక్కని తండ్రి నిన్నెడయుఁ । జాలితినే యని కంటనీరిడు
జ్జెక్కెరవెట్టు మచ్చిక నొ । నచున్ఁ గురుల్మడుచు న్నగించు న
మ్మక్కనిపించు విద్దియము । లాడఁగజేసెడు మాటిమాటికిన్॥ ౧౬౨

ఆ॥ పాటసారియంతఁ । బట్టఁజాలని వేడ్కఁ
జెలఁగి నంగడిని । చేతికిఁ దన
యనుఁగుఁ గొడుకునిచ్చి । యడఁకువ పెంపార
నొసటఁ గేలుమోడ్చి । నుడివె నిట్లు॥ ౧౬౩

గీ॥ మిగుల నట్టేట గ్రుక్కలు । మ్రింగుకొనుచు
నట్టె కొట్టుకొనెడు పట్లఁ । బట్టునిలుపు
నడుగు నీయయ్యగా నొడ్డు । నందుజేచున్
నోడగా నీవు నన్నుఁగా । పాడినారు॥ ౧౬౪

ఉ॥ ఇంచుకవాండ్రనైనఁ దమ । కెక్కుడుగాఁ గనుచుంద్రు కోర్కి కా
సించర కొల్చుకొంద్రిడుము । చేసిన వారలకేని మాఱుచె
ల్లించరు కల్లలెన్నఁడు గ । డింపరు మిక్కిలికూర్మి యెల్లెడం
బెంచుదు రెల్ల వారలిఁక । మిమ్ముఁదలంచిన గీడులంటునే॥ ౧౬౫

ఆ॥ మునుపు నీటిలోన । మున్గి యూపిరియాడ
కున్నమాడ్కి నిడుమ । లొందుచుంటి
ఇపుడు పైకిఁదేలి । న పగిది మీప్రాపు
వలన మించి మంచి । బ్రతుకుఁగంటి॥ ౧౬౬

ఆ॥ అనుచుఁ బల్కఁగ విని । యా రాచకొడుకనె
సంగడీఁడ యింత । సంతసంబు
మనకు సమకుఱుటకు । మాయయ్యకత మఁతఁ
డౌర మాఱువేలు । పనఁగవచ్చు॥ ౧౬౭

గీ॥ అయ్య నీయాలు కాఁబోలు । నదిగొ వచ్చు
చుండె నిరుదట్లఁ జెలువల । నొప్పు మీఱి
మీఁది యంతరువందు నే । మెలఁగుచుందు
మించి మీరిచ్చుటన్మెచ్చ । టించుకొనుఁడు॥ ౧౬౮

క॥ అని రాచపట్టి చనె వె
ల్గును వెన్కను చందమామ । కొమరున దాడి
న్మనుకొని తన యిల్లాల్రాఁ
గనుఁగొనె నా బాటసారి । కనుపండువుగాన్॥ ౧౬౯

గీ॥ పిదప నయ్యాలు మగలు పె । న్వేడ్క నొండొ
రువుల కౌఁగిళ్లలో బల్ద । డవుగఁ జొక్కి
నంతఁ బెనిమిటితోడ నా । యతివ పలికె
జాలి నునుసిగ్గు । కన్గవ మేళగింప॥ ౧౭౦

క॥ నీ కౌఁగిటఁబడు నాదట
చేకూరు ననుకొనలేదు । చీఁకటిగా నిం
దాక నగపట్టె నంతయు
నాఁకలి నిద్దురలు దప్పు । లయ్యెన్సుమ్మీ॥ ౧౭౧

గీ॥ ఆసయు న్నందియము డెంద । మందుఁ బెనయ
నెంతయో యోచిఁ దుదకిసు । మంతయైన
ముందు తెరుకువయగపట్టు । మిం దెగించి
బిచ్చు చొరఁబాఱ నుంటి ని । క్కచ్చితోడ॥ ౧౮౨

గీ॥ అనుచుఁ బల్కెడు మగువ న । క్కున గదించి
కురులు దువ్వుచు ముద్దులు । గొనుచు బాట
సారియనె పేల్పు నెమ్మి నో । చానమనకుఁ
దెరలె నిక్కట్టులెల్ల నా । తెరవు వినుము॥ ౧౮౩

సీ॥ అపుడట్లు మున్నిటి । యందుఁ బెన్గాలికిఁ
దలడిల్లు నోడ చా । పలను డింపఁ
జని మెట్టు తాఁకునఁ । జప్పునఁ ద్రుళ్లిపైఁ
బడితి నేమని చెప్పు । వాఁడఁ బిదప
మున్గితేలుచు నదే । మూలకో కొట్టంగఁ ।
బడి యొకంతటఁ దెల్వి । వడసి యొడ్డు
చేరితినని పోల్చి । చేతులున్గాళ్లు మె
ల్లనఁ గూచుఁ గొని లేచి । నిను దలంచి
యేల బ్రతికితినని యేడ్చి । యేడ్చి సూది
కొండమీఁదుగ నొకజేని । దండ కరిగి
వాని నగరున నీదు చే । వ్రాలు చదివి
మంచినోమున నిన్ను గ్రు । మ్మఱఁ గలసితి॥ ౧౮౪

క॥ పడఁతీ వెనుకటి వంతల
కడలవలదు మనకు హాయి । నందించిన రా
కొడుకదె నడతెంచెడు నం
దడితో నేనచటి కేగె । ద నని పలుకుచుఁ॥ ౧౮౫

చ॥ వడివడి నేగి యిట్లనియె బాపురె యేలిక వేడ్కలెవ్వియో
పొడమినయట్లు తోఁచె ననఁ। బొంగుచు రాకొమరుండు సెప్పెని
క్కడి మన యక్కఱలొప్పెసఁగె। గాంచితి మామ నతండు నాకొడం
బడి తన కూఁతు నిచ్చుటకు। మాటనొసంగెను జుమ్మి నెయ్యుఁడా॥ ౧౯౬

ఆ॥ నన్నుఁబోలువాని। నామామ వెదకియుఁ
గాంచలేక యిట్టు। కట్టువడియె
వేఱు నడతలగుటఁ। బెండ్లి మా నగరున
సలుపు కొనఁగ సెల వొ। సంగినాఁడు॥ ౧౮౭

ఆ॥ అనుచు నతఁడు పల్కు। నంతఁ జెలుల్చుట్టు
గొల్చు చుండఁ బెండ్లి। కూఁతురరుగు
దెంచె హాయులు మీఱ। దివ్వెల యందునఁ
దనరు మేటి తెలి మ। తాబువలెను॥ ౧౮౮

క॥ అప్పుడడుగులు న్దడఁబడ
గుప్పునఁ బూఁదావులీను। కొప్పుసడల సి
గ్గొప్పఁ బసినాటి చనవున
నప్పడఁతుక మగని కేలి। నంది బిఱానన్॥ ౧౮౯

గీ॥ ముత్తెపుఁ జిఱునగవు మొల। కెత్తుచుండఁ
జీఁకటి మెఱుపు వాల్చూపు। చిమ్ముచుండ
కుల్కు తల్కులఁ బయ్యెద। కొంగు సరదు
కొంచు బావా యనుచుఁ బల్కు। రించునంత॥ ౧౯౦

నట్టువు॥ పొంగుచు మేను గగుర్పొడు వన్దమి, పొదలంగఁ
బువువిలుతుని వలె రా
సింగము మైమఱపుంగొని। చెంగటి చెలులఁ గనుగొనక
కవుఁగిలిలో
నం గదియించి తనుంగడు ముద్దిడ।నగి చెలిపెనఁగి మఱ
లునటు క
న్నుం గవతార్పులఁ బయ్యెద జార్పుల। ను బలుమఱు
నెఱపెఁ జెలువముగాన్॥ ౧౯౧
గీ॥ ఇట్లు బలుపు మున్నీటిలో, నీఁదులాడు
వారిఁదోడ్కొని యా బాట। సారి కడలి
దాఁటి కొన్నాళ్లకున్దన, మేటి సంగ
డీని నప్పెండ్లి కొడుకు తం।డ్రిని గని యనె॥ ౧౯౨
క॥ ఱేఁడా కను నీ కొడుకు
న్గోడలిని న్వీరె నాదు। కోమలి బుడుతల్
నేఁడు మొదల్నీ వారము
వేడుకతో మమ్మునింకఁ। బెంచఁగవలయున్॥ ౧౯౩
ఆ॥ అనఁగ ఱేడు వలికె। నాబాటసారితో
మీరు మేము కలసి। మెలసి హాయి
చెలఁగ మనుదమింకఁ, గలకాల మొక్కటి
యగుచుఁ బాలనేయి, యలరుమాడ్కి॥ ౧౯౪
చ॥ అనవిని బాటసారి కడు। హాయిగ నంతటనుండి కోరిన
ట్లనయముఁ దన్విమీద జగ।మంతయు నొక్కటఁదానెయైనతీ
రున నెదురెందున న్గనక। క్రొత్త తనర్పుల నిచ్చలందుచు
న్మనుగడ రేపుమాపు లొక। మచ్చుగ నెల్లెడ మెప్పు
పొందెడున్॥ ౧౯౫

———

